ఎన్. ముక్తేశ్వరరావు ఐ.ఏ.యస్.(విశ్రాంత)
94914 28078

# ఆంగ్ల మాధ్యమం ఉత్తర్వు చెల్లదు
# ఉన్నత న్యాయస్థానం తీర్పు చారిత్రాత్మకం

**భాష, సంస్కృతి, వాఙ్మయం, పురాతత్వ శాస్త్రం లాంటి అంశాలు ఏమిటి? వాటి స్వరూప స్వభావాలు ఏమిటి? అవి సమాజంలో ఎలా పనిచేస్తాయి? ముఖ్యంగా భాష చరిత్ర నిర్మాణంలో, శాస్త్రవిజ్ఞాన వ్యాప్తిలో మానవజాతి పురోగతిలో అవి అతి పెద్ద మూలధనం. తరగని పిత్రార్జితం. భాషను ఆషామాషీగా తీసుకోవడం వల్ల అనేక సమాజాలు, దేశాలు బానిసత్వంలోకి, పరాధీనత లోకి వెళ్లిపోయాయి. భాషలు కనుమరుగయ్యాయి. జాతులు రూపురేఖలను పోగొట్టుకుంటున్నాయి.**

**ఏ సమాజం లోనైనా మాతృభాషలోనే విద్య విజ్ఞానాలు, శాస్త్ర సాంకేతిక రంగాలు ఆలనాపాలనా ఉండాలి. మనందరి రాత బావుండక భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటి నుంచి ఇవాల్టి వరకు అడపాదడపా కొద్దిపాటి మినహాయింపులు తప్ప - భాష విషయంలో మన పాలకులు ఆచంట మల్లన్నలే! ఒకళ్ళ కన్నా ఒకళ్ళు ఘనులే! వీళ్ళ దృష్టిలో భాష, సమాజం, దేశం, సంస్కృతుల గురించి మాట్లాడేవాళ్ళు పాత కాలం మనుషులు. ఈ నేపథ్యంలో పులి మీద పుట్ర లాగా, బొద్దాదని వాళ్ళకి ఇంగ్లీష్ మీడియం అంటూ కొత్త పల్లవి అందుకున్నారు. డాక్టర్ గుంటుపల్లి శ్రీనివాస్, రాంభొట్ల శ్రీనివాస సుధీర్ మొదలైన భాషాభిమానులు, దేశాభిమానులు దీనిని హైకోర్టులో ప్రశ్నించారు.**

**ఆ సందర్భంలో హైకోర్టు మాతృభాషకు సంబంధించిన అనేక అంశాలను, వాటి ఆనుపానులను రాజ్యాంగం, చరిత్ర, మహనీయుల ఆలోచనలు, విద్యావేత్తల తత్వ ధార వీటన్నిటి వెలుగులో పరిశీలించింది. పూర్వ చరిత్రను , పురోగతిని మాట్లాడింది. ఈ తీర్పు, భాష అనేది చాలా మంది అనుకుంటున్నట్లు కేవల భావోద్వేగం, అభిమానం లాంటి పరిమిత పరిధికి చెందినది కాదని స్పష్టం చేసింది. ఇరుకు సందుల నుంచి బయటకు తెచ్చి భాష ఎలా నిత్య అవసరమో నొక్కిచెప్పింది. శాస్త్రీయతను, మాతృభాషలను, దేశాన్ని ప్రేమించే వారందరూ శిరసా నమస్కరించి చదవదగినది ఈ తీర్పు. చదువుకుందాం ! చర్చించుకుందాం! నలుగురి చెవిన ఈ మాటలు వేద్దాం!**

చాలా సందర్భాల్లో భాషా సంస్కృతులపై జరిగే చర్చలు వింటున్నప్పుడు ఏనుగు-గుడ్డివాళ్ళ కథ గుర్తుకువస్తుంది. తోక పట్టుకున్నవాడు తోకలాగా ఉందని, తొండం పట్టుకున్నవాడు తొండం లాగా ఉందని చెప్పడం జరుగుతుంది. భాషా సంస్కృతులు లాంటి విషయాలలో కేవలం ఒక వైపు మాత్రమే పరిమిత దృక్కోణంతో చూడటం సమంజసం కాదు.

దానికి భిన్నంగా ఆంధ్రప్రదేశ్ ఉన్నత న్యాయస్థానం ఇటీవల మాతృభాష విద్యా విధానం మీద వెలువరించిన తీర్పు చాలా చారిత్రాత్మకమైనది. ఇంతకుముందు ఎన్నడూ లేనివిధంగా ఒక అద్భుతమైన విశ్లేషణ చేసి దాన్ని రాజ్యాంగ నేపథ్యం నుంచి సమీక్షించి సారాంశం మొత్తాన్ని ఇమిడ్చి చెప్పిన తీర్పు ఇది.

భాషా విషయకమైన సమస్త విషయాలు కూలంకషంగా పరిశీలించి సమాజానికి సమాజ భవిష్యత్తుకి కూడా సంబంధించి ఆలోచన చేయడం అనేది ఇందులో ఉన్న విశేషం. ఇదే సందర్భంలో మాతృభాష అన్న అంశంపై పిల్లలపరంగా ఆలోచించడం ఇందులో ఉన్న గొప్పతనం.

ప్రభుత్వ పాఠశాలల్లో ప్రాథమిక స్థాయిలో అంటే ఒకటి నుండి ఆరో తరగతి వరకు ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెడుతూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జారీచేసిన జిఓలు చెల్లవని హైకోర్టు స్పష్టం చేసింది. బోధన మాధ్యమాన్ని ఏకపక్షంగా మార్చే అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి లేదని చెప్పింది. ప్రభుత్వ నిర్ణయం రాజ్యాంగానికి, విద్యాహక్కు చట్ట నిబంధనలకు వ్యతిరేకంగా ఉందని తెలిపింది.

ఒకటి నుండి ఎనిమిదో తరగతి వరకు మాతృభాషలోనే విద్యా బోధన ఉండాలని, అది పిల్లల వ్యక్తిత్వ వికాసానికి దోహదపడుతుందని కోర్టు అభిప్రాయపడింది. పిల్లలను ఏ మాధ్యమంలో చదివించు కోవాలో నిర్ణయించుకునే హక్కు తల్లిదండ్రులకు ఉందని స్పష్టం చేసింది. దీంతో ఆంగ్ల మాధ్యమం కోసం 2019 నవంబరు నెలలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన జీవో నెంబర్ 81, 85 లు రద్దయ్యాయి

**మాధ్యమాన్ని నిర్ణయించేది ఎవరు**

విద్యా సంబంధమైన ఒక కీలక విషయం బోధన మాధ్యమం. పిల్లల మనస్తత్వ శాస్త్రాన్ని ఒక ప్రత్యేక అంశంగా అధ్యయనం చేసిన వారు ఏది పిల్లలకు తగిన మాధ్యమము? వారు ఏ వయసులో ఏ మాధ్యమం ద్వారా బాగా నేర్చుకోగలరు అనే విషయాన్ని నిర్ణయించ గలరు. దీనికి కేంద్ర స్థాయిలో ఎన్సీఈఆర్టీ, రాష్ట్రస్థాయిలో ఎస్సీఈఆర్టీ లు ప్రధాన సంస్థలుగా పని చేస్తుంటాయి. విద్యారంగంలో వస్తున్న పరిణామాలను రావలసిన మార్పులను నిర్దేశించ వలసినది ఈ సంస్థ లే! కాబట్టి ప్రభుత్వం విద్యారంగ సమస్యలపై నిర్ణయం తీసుకోవాలి అనుకున్నప్పుడు పై రెండు సంస్థలలో ఉన్న పండితులను సంప్రదించి నిర్ణయం తీసుకోవాలి. ప్రభుత్వం అటువంటి ప్రయత్నం చేయకుండానే ఏకపక్షంగా ఈ నిర్ణయం తీసుకున్నందువల్ల ఇది చెల్లుబాటు కాదని కోర్టు స్పష్టంగా చెప్పింది.

**ఎలా రాజ్యాంగ విరుద్ధం?**

రాజ్యాంగంలో అధికరణ 19(1) భావవ్యక్తీకరణ వాక్ స్వాతంత్ర్యం గురించి చెబుతుంది. విద్యాభ్యాసం కూడా దానిలో

అంతర్గత అంశమే! మాధ్యమాన్ని ఎంపిక చేసుకునే హక్కు19(1) A కల్పిస్తోంది. ఇప్పుడు ప్రభుత్వం అందరూ తప్పనిసరిగా ఆంగ్ల మాధ్యమంలోనే చదువు కొనసాగించాలి అని చెప్పడం రాజ్యాంగ ఉల్లంఘనే! అలాగే అధికరణ 21 ప్రకారం వ్యక్తిగత స్వేచ్ఛను నిరాకరించడానికి వీలులేదు. ఈ రకంగా 81, 85 జీవోలు విద్యాహక్కు చట్టానికి, రాజ్యాంగ స్ఫూర్తికి తూట్లు పొడిచేలా ఉన్నాయని కోర్టు అభిప్రాయపడింది.

రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసిన జీవోపై కేంద్రం స్పందించింది. ఎన్సిఎఫ్ 2005, విద్యా హక్కు చట్టాలకు అనుగుణంగా ఈ జీవో లేదని చెప్పింది. అన్ని రాష్ట్రాలు ఆమోదించిన ఎన్ సి ఎఫ్ లోని 3.1.1 కి అనుగుణంగా ఈ జీవో లేదని అసిస్టెంట్ సొలిసిటర్ జనరల్ శ్రీ బి.కృష్ణమోహన్ స్పష్టం చేశారు. ఈ సందర్భంగా నేషనల్ పాలసీ ఆన్ ఎడ్యుకేషన్ 1968 ను కూడా ఉదాహరించారు. ప్రాథమిక స్థాయిలో విద్య ప్రాంతీయ భాషలలోనే ఉండాలని అది వారి సాంస్కృతిక అభివృద్ధికి అవసరమని 4.3లో ఎన్ పి ఈ 1968 తెలిపింది. డాక్టర్ కె కస్తూరిరంగన్ ఆధ్వర్యంలో రూపొందిన ఎన్ ఈ పి 2019 కూడా ఆయా రాష్ట్రాలు మాతృభాషలోనే విద్యా బోధన చేయాలని సిఫారసు చేసింది.

ఇటువంటి వాదనలన్నీ విన్న తర్వాత తీర్పు ఇవ్వబోయే ముందు కోర్టు ప్రధానంగా ఐదు ప్రశ్నలు లేవనెత్తింది

1. స్వాతంత్ర్యానికి ముందు ప్రాథమిక విద్య బోధనా మాధ్యమం పరిస్థితి ఎలా ఉంది

2 స్వాతంత్ర్యానికి ముందు గాని తర్వాత గాని ప్రముఖులు విద్యావేత్తలు మేధావులు దీనిపై ఎలాంటి అభిప్రాయాలు వ్యక్తం చేశారు?

3 భారతదేశంలో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రాథమిక విద్యారంగంలో బోధనా మాధ్యమం తీరుతెన్నులు ఎలా ఉన్నాయి?

4 రాజ్యాంగ పరంగా చట్టపరంగా దీనికున్న నిబంధనలు ఏమిటి? విద్యా హక్కు చట్టం ఏం చెబుతోంది? ఇతర కేంద్ర రాష్ట్ర చట్టాలు శాసనాలు ఏమి చెబుతున్నాయి?

5 ప్రాథమిక విద్య ఆంగ్ల భాషలో ఉండాలంటూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 20 11 2019 న విడుదల చేసిన 85 వ నెంబర్ జీవో చారిత్రక నేపథ్యానికి, విద్యారంగ చట్టాలకు, కేంద్ర ప్రభుత్వ శాసనాలకు అనుకూలంగా ఉందా లేదా?

ఈ ఐదు ప్రశ్నలకు సమగ్రమైన సమాధానాలు చెప్పి పూర్వాపరాలు సమీక్షించి అప్పుడు కోర్టు తన తీర్పును వెలువరించింది. పై ఐదు ప్రశ్నలకు హైకోర్టు ఎలాంటి వివరణ ఇచ్చిందీ చూద్దాం.

### స్వాతంత్ర్యానికి ముందు భారతదేశంలో ప్రాథమిక విద్య- బోధన మాధ్యమం

వ్యాపారం చేసి లాభాలు సంపాదించడం కోసం భారతదేశం లో అడుగు పెట్టిన బ్రిటిష్ వారు అంతకుముందు ఉన్న విద్యా విధానాలను, పద్ధతులను రద్దుచేసి మిషనరీ పాఠశాలలు ప్రవేశపెట్టారు. మధ్య, ఎగువ మధ్య తరగతిలోని కొంత మందిని ప్రభుత్వానికి ప్రజలకు మధ్య అనుసంధాన కర్తలుగా చేయడమే వీరి చదువు లక్ష్యం. "వాళ్లు భారతీయులై ఉండి గుణాలలో బ్రిటిష్ వారిగా ఉండాలి". అదీ వారి ధ్యేయం. దీన్ని డౌన్‌వార్డు ఫిల్టరేషన్ సిద్ధాంతం అని అంటారు. దీన్ని అమలు చేయడానికి 1813 చట్టం, లార్డ్ మెకాలే విద్య విధానం, 1835 హంటర్ కమిషన్ మొదలైనవి వచ్చాయి

బ్రిటిష్ విద్యావిధానం భారతదేశంలో గుమాస్తాలను తయారు చేయడానికి పనికి వచ్చింది అన్నది సుస్పష్టం. అందుకే వారు ఆంగ్ల మాధ్యమం ఉండాలన్న విషయాన్ని బలపరిచారు.

స్వతంత్ర పోరాట దశలో భారతీయ మేధావులు (జ్యోతిరావు పూలే , బాలగంగాధర్ తిలక్) ప్రారంభించిన పాఠశాలలు, కళాశాలలు కూడా ప్రాథమిక విద్య స్థానిక భాషలోనే ఉండాలని, సెకండరీ విద్య ఆంగ్ల మాధ్యమంలో ఉండాలని నిర్ధారించారు.

1911లో గోపాలకృష్ణ గోఖలే ఉచిత నిర్బంధ విద్య కోసం ప్రయత్నించారు. మొదటి ప్రపంచ యుద్ధం వల్ల అది సాధ్యం కాలేదు. సహాయ నిరాకరణ ఉద్యమం తర్వాత స్థానిక భాషలో చదువు అన్న అంశం ఊపందుకుంది.

1919 నుండి 1982 ప్రాంతంలో మహాత్మా గాంధీ విదేశీ సంస్కృతిపై ఆధారపడ్డ ఆంగ్ల విద్యా విధానాన్ని వ్యతిరేకించారు. దీంట్లో దేశీయ సంస్కృతికి చోటు లేకుండా పోయిందని అన్నారు. విదేశీ మాధ్యమం అసలైన విద్య నేర్చుకోవడం అసాధ్యమన్నారు.

1921 తర్వాత మాధ్యమిక పాఠశాలలో మాతృభాష మాధ్యమంగా ఉండసాగింది. 1937 నాటికి ఉన్నత పాఠశాలలో కూడా ఈ విధానం అమలు అయినది. 1937లో ప్రాథమిక విద్య కోసం రూపొందించిన విద్యా విధానం మార్గదర్శిగా నిలిచింది. 7-11 ఏళ్ల మధ్య ఉన్న పిల్లలకు నిర్బంధ ప్రాథమిక విద్యను మాతృభాషలో అందించాలని ఇది ప్రతిపాదించింది.

1945లో నయీ తాలిమ్ విద్యా విధానం 14 ఏళ్లలోపు పిల్లలకు నిర్బంధ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టింది.

### స్వాతంత్ర్యానికి ముందు, తర్వాత మాతృభాషలో విద్యాబోధనం పై ప్రముఖుల అభిప్రాయాలు

1. పాఠశాలలో ఆయా మాతృభాషల్లోనే విద్యాబోధన కొనసాగాలని ఆనాటి ప్రసిద్ధ మేధావులు అభిప్రాయపడ్డారు.

" భాషలన్నీ ఉదాత్త ఆలోచనలను వ్యక్తీకరించడానికి సమర్థమైనవే అయినా ఎవరి మాతృభాషలో వారు ఆ భావాన్ని ఇంకా బాగా వ్యక్తీకరించగలరు. మాతృభాషలో పరిచయం చేసిన భావనలను మిగతా భాషలలో పరిచయం చేసిన దానికన్నా తొందరగా గ్రహిస్తారు. శరీరానికి రక్తము ఎలాంటిదో మాతృభాష మెదడుకు అలాంటిది. అందువల్ల పిల్లలకు మాతృభాషలో బోధిస్తే మెరుగైన ఫలితాలు వస్తాయి. నేర్చుకోవడం, భాష అనేవి పరస్పరం సన్నిహితమైన అంశాలు అని చెప్పడానికి తగిన ఆధారాలు ఉన్నాయి. ఎవరి భాషలో వారికి బోధిస్తే ప్రతి మనిషి జ్ఞానాన్ని గ్రహించగలుగుతారు.

మహాత్మా గాంధీ ఆంగ్ల భాష మన హృదయాలలో ఆత్మీయమైన స్థానాన్ని ఆక్రమించుకుందని అన్నారు. మన తల్లిని మనం ప్రేమించినంతగా మన భాషని ప్రేమించ లేకపోతున్నామని అన్నారు. తల్లిపాలు తాగినంత సహజంగా - ఎన్ని లోపాలు ఉన్నా నేను నా మాతృభాషకు అతుక్కొనిపోయి ఉంటాను. ఆమరణ పర్యంతం మాతృభాష ఒకటే తల్లి పాలలాగ నా అవసరాలను తీర్చగలదు.

ఆంగ్ల భాష లేకపోతే అభివృద్ధిలేదు అనేది కేవలం మన భావ దాస్యం నుంచి పుట్టిన అభిప్రాయం మాత్రమే!

శిశువు తల్లి నుండి మొదటి పాఠాలు నేర్చుకుంటుంది. అందువలన ఒక దేశంలో ఉన్న వారికి ఆ దేశ మాతృభాష కాకుండా వేరే భాషని అంటకట్టడం మహా పాపం.

రవీంద్రనాథ్ ఠాగూర్ విద్య ఆనందదాయకంగా ఉండాలని అభిప్రాయపడ్డారు. పిల్లలకు విద్యా బోధన మాతృభాషలోనే ఉండాలి అనే తన అభిప్రాయానికి కట్టుబడి ఉన్నానని కాకపోతే ఆంగ్లాన్ని స్థాయికి తగినట్లుగా కొద్ది కొద్దిగ ప్రవేశపెడుతూ మాతృభాషకు అంగముగా మాత్రమే ఉండేలా చూడాలని అన్నారు.

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ గారి దృష్టిలో చదువంటే భగవంతుడికి సన్నిహితంగా తీసుకొనిపోయేదే. 'స్థలకాలాలకు అతీతంగా ఉండే అదృశ్య ప్రపంచాన్ని చూసేందుకు సహకరించేది అసలైన చదువు' అంటారాయన. పై మహాత్ముల అభిప్రాయాలను గమనించిన తర్వాత విద్యార్థి పరివర్తనకు మాతృభాషే అసలైన సాధనం అని స్పష్టమవుతోంది.

### మూడవ ప్రశ్న

రాజ్యాంగం లోని ఎనిమిదో షెడ్యూల్లో హిందీ ని జాతీయ భాషగా ఉంచేటట్లు ఇతర భాషలకు తగిన ప్రాధాన్యం ఇచ్చేటట్లు ఆమోదించారు. ప్రాథమిక స్థాయిలో మాతృభాషే బోధన మాధ్యమంగా ఉండాలని సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు నొక్కి చెప్పారు. ఉన్నత స్థాయిలలో ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెట్టొచ్చు అన్నారు.

స్వాతంత్ర్యానంతరం విద్యకు సంబంధించి అనేక కమిషన్లు ఏర్పాటయ్యాయి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ 1955 బోధనా మాధ్యమం గురించి ప్రత్యేకంగా చెప్పింది. కమిషన్‌లోని 775 పేరాలో వివరించారు. NPE 1968 కూడా భాషల అభివృద్ధిపై దృష్టి పెట్టింది. విద్యా సాంస్కృతిక అభివృద్ధి కోసం భాషలను అభివృద్ధి చేయడం అత్యావశ్యకం అని చెప్పింది. ఈ పని జరగకపోతే ప్రజలలోని సృజనాత్మక శక్తులు బహిర్గతం కావని స్పష్టం చేసింది. విద్యా ప్రమాణాలు పెరగవని ఖరాఖండీగా చెప్పింది. విజ్ఞాన వ్యాప్తి జరగదు అని చెప్పింది. మేధావులకు సామాన్యులకు మధ్య అగాథం పెరిగిపోతుందని అభిప్రాయపడింది. ఇప్పటికే స్థానిక భాషలోనే ప్రాథమిక విద్య బోధింప పడుతోంది. విశ్వవిద్యాలయ స్థాయికి తీసుకొనిపోవడానికి సత్వర చర్యలు చేపట్టాలి. ఈ కమిషన్‌లు ప్రతిపాదించబడిన త్రిభాషా సూత్రం అన్ని రాష్ట్రాలు చిత్తశుద్ధితో చేయలేదు. చిన్న రాష్ట్రాల్లో మాత్రం ఫలితాలు చక్కగా వచ్చాయి.

ప్రజలు అడుగుతున్నారు కాబట్టి మేము అందరికీ ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెడతామని ప్రభుత్వం చెప్పడం దాని మౌలిక బాధ్యతను విస్మరించడమే! ఎందుకంటే చాలా విషయాలలో ప్రభుత్వం దానంతట అదిగా ముందుకు వచ్చి ప్రజలకు ఏది క్షేమమని భావిస్తుందో అదే పనిని బలవంతంగానైనా చేయిస్తోంది.

కరోనా ప్రాణాంతకంగా మారినప్పుడు ప్రభుత్వం లాక్ డౌన్ విధించింది కదా!

నిరక్షరాస్యులైన తల్లిదండ్రులు పాఠశాలకు వచ్చి మా అబ్బాయిని చితకబాదండి అని అడిగినా కూడా తెలివైన ఉపాధ్యాయుడు ఏం చేస్తున్నాడు? కొడితే చదువు రాదు. మీ పిల్లవాడికి మేము నచ్చజెప్పి చదువు చెబుతాం అంటున్నాడా లేదా?

యుక్త వయసు రాకముందే బాల్య వివాహాలు చేస్తే శిక్షలు విధిస్తూ ఉన్నామా లేదా ఇలాంటివి ఎన్నయినా ఉదాహరించవచ్చు. కోర్టు తీర్పులో విద్యార్థి ఏ మాధ్యమాన్ని ఎంచుకోవాలి అనే విషయాల్లో అధికారం తల్లిదండ్రులకు సంరక్షకులకు ఉంటుందని తేల్చి చెప్పింది

ప్రాథమిక విద్యలో విద్యాభ్యాసం కొనసాగించే విద్యార్థికి బోధన మాధ్యమానికి సంబంధించిన అవగాహన పరిణతి ఉండవు కాబట్టి ఆ బాధ్యతను తల్లిదండ్రులకు కేటాయించిందని అనుకోవచ్చు. నిజానికి మేధావుల అధ్యయన ఫలితంగా వచ్చిన అంశాలను పరిశీలించి ప్రాథమిక విద్య మాతృభాషలోనే కొనసాగాలి అని నిర్దేశించడం ప్రభుత్వ నైతిక విధి. దీన్ని పాటించకపోగా దీనికి పూర్తి వ్యతిరేక నిర్ణయం తీసుకొని అమలు పరచబోవడం శోచనీయం

### తల్లిదండ్రులు ఆంగ్ల మాధ్యమాన్ని ఎందుకు అడుగుతున్నారు?

తల్లిదండ్రులు అడిగారు కాబట్టి మేము ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశ పెడుతున్నాము అని చెప్పబోయే ముందు అసలు తల్లిదండ్రులు ఆంగ్ల మాధ్యమానికి ఎందుకు అంత ప్రాముఖ్యం ఇస్తున్నారు? అన్నది కూడా ఆలోచించాల్సిన విషయం. ఒక్క ముక్కలో చెప్పాలంటే బ్రిటిష్ వాడి ఆధిపత్య ధోరణికి, భారతీయుడి దాస్య భావనకు ఫలితమే ఈ కోరిక. స్వాతంత్ర్యం తరువాత శాస్త్ర సాంకేతిక రంగాలలో సాధించే అభివృద్ధికి మాధ్యమంగా ఆయా మాతృభాషలను సుసంపన్నం చేసుకోవాల్సిన కర్తవ్య నిష్ఠ ఆయా భాషీయులదే! దురదృష్టవశాత్తు ప్రభుత్వాలు గాని ప్రజలు గాని ఈ విషయంలో చూపించాల్సినంత చొరవ చూపించక పోవడంవల్ల విజ్ఞానం చాలా సందర్భాలలో ఆంగ్ల భాషలోనే అందుబాటులో ఉండసాగింది. దాన్ని అందిపుచ్చుకొని ఉద్యోగావకాశాలను కైవసం చేసుకోవడం కోసం తల్లిదండ్రులు వాళ్ళ పిల్లల్ని ఆంగ్ల మాధ్యమంలో చదవడానికి ప్రోత్సహించారు. ఇది మొదట్లో ఉన్నత విద్యకు మాత్రమే పరిమితమై ఉండేది. రాను రాను దీనిపై అటు ప్రజలకు ఇటు ప్రభుత్వాలకు అపోహలు ఎక్కువయ్యాయి. ఇంగ్లీష్ ను ఒక భాషగా చదువుకోవడం కన్నా మొత్తం మాధ్యమమే ఆంగ్లంలో ఉంటే ఆ భాషలో ఇంకా పట్టు బాగా సాధించవచ్చు అని విశ్వసించారు. ఇది అశాస్త్రీయం . హేతుబద్ధం కాదు అని చరిత్ర నిరూపించింది. ఎందుకంటే ఈ మధ్యకాలంలో ఒకటో తరగతి నుంచి గ్రాడ్యుయేషన్ అయిపోయే వరకు ఆంగ్ల మాధ్యమంలోనే చదివిన విద్యార్థినీ విద్యార్థులు కూడా కమ్యూనికేషన్ స్కిల్స్ లేక ఉద్యోగాలు పొందలేకపోవడం చూస్తున్నాం. కేవలం మాధ్యమం ద్వారా భాష వచ్చేటట్లు అయితే ఇటువంటి పరిస్థితి తల ఎత్తకూడదు. మరి పొరపాటు ఎక్కడ జరిగింది అని విశ్లేషించుకుంటే తేలేది ఒకటే విషయం. ఆంగ్లాన్ని ఒక భాషగా చెప్పినా ఇబ్బంది లేదు. కానీ ఆ చెప్పే విధానం సరిగా ఉండాలి. మిగతా సబ్జెక్టులు ఏ భాషలో చదివారు అన్నది ముఖ్యం కాదు. ఈ పొరపాటును సరిదిద్దుకోకుండా ఇటువంటి ప్రయత్నాలు ఎన్ని చేసినా వ్యర్థమే! **ప్రభుత్వానికి నిజంగా వెనుకబడిన వర్గాల పిల్లల శ్రేయస్సు పై దృష్టి చిత్తశుద్ధి ఉంటే ముందు వారికి ప్రాథమిక విద్యను మాతృభాషలో పటిష్టంగా అందించి సెకండరీ స్థాయిలో ఆంగ్లాన్ని ప్రవేశపెట్టి సమర్థులైన ఆంగ్ల ఉపాధ్యాయులతో అంటే ఆ సబ్జెక్ట్ ను ఎలా బోధించాలో తెలిసిన నైపుణ్యం ఉన్న ఉపాధ్యాయులతో బోధింప**

**చేస్తే వారు సరైన పౌరులుగా ఎదిగే అవకాశం ఉంటుంది.**

ఈ విషయంపై (పిల్) ప్రజా ప్రయోజన వ్యాజ్యం దాఖలు చేసిన గుంటుపల్లి శ్రీనివాస్ గారు తీర్పు వచ్చిన అనంతరం ఒక టీవీ ఇంటర్వ్యూలో ఇలా చెప్పారు.

“ ఆంగ్ల మాధ్యమాన్ని ప్రభుత్వ పాఠశాల విద్యార్థులకు ఎవరూ దూరం చేయలేదు. తెలుగు ఇంగ్లీష్ మాధ్యమాలు రెండూ ప్రభుత్వ పాఠశాలల్లో సమాంతరంగా ఉన్నాయి.

కేవలం ఆంగ్ల మాధ్యమంలో మాత్రమే చదవాలి అని పిల్లలను నిర్బంధించడం మంచిది కాదు. దానికి వ్యతిరేకంగా మేము పోరాడుతున్నాం!

వెనుకబడిన పిల్లలు అవకాశాలు అందిపుచ్చుకోలేకపోవడానికి కారణాలు రెండు: 1. ప్రీస్కూల్ ఎడ్యుకేషన్ లేకపోవడం 2. మౌలిక వసతుల, మానవ వనరులలోపం.

ఇటువంటి మౌలిక సమస్యలపై దృష్టి సారించకుండా కేవలం మాధ్యమం వల్ల వెనుకబడుతున్నారు అని చెప్పడం సబబు కాదు.

### ఉపాధ్యాయుల పాత్ర

విద్యారంగానికి సంబంధించి అత్యంత కీలకమైన ఈ విషయంపై బయట సమాజంలో చర్చోప చర్చలు జరుగుతున్నప్పుడు ఉపాధ్యాయ వర్గం స్పందించాల్సిన అంతగా స్పందించకపోవడం బాధాకరం.

ఉపాధ్యాయ సంఘాలు, భాషా పండితులు మాతృభాషలో బోధన ఆవశ్యకత గురించి సమాజాన్ని తల్లిదండ్రులను చైతన్య పరచాల్సిన అవసరం ఉంది.

హైకోర్టు తీర్పు నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 21వ తారీఖున జీవో 20 విడుదల చేసింది. క్షేత్రస్థాయిలో పనిచేస్తున్న గ్రామ కార్యదర్శులు మొదలైన వారి సహాయంతో తల్లిదండ్రులు వారి  పిల్లలను ఏ మాధ్యమంలో చదివించాలి అనుకుంటున్నారో వివరాలు సేకరించండి అన్నది ఈ జీవో సారాంశం. దీనికోసం ఒక నమూనా పత్రం కూడా తయారు చేశారు.

దరఖాస్తు రూపకల్పనలోనే  అనవగాహన స్పష్టంగా కనిపిస్తోంది. ఇటువంటి విషయాలలో అభిప్రాయ సేకరణకు రూపొందించే నమూనా కేవలం అవును/ కాదు అనే పద్ధతిలో కాకుండా వివరణాత్మకంగా ఉండాలి.

మీ పిల్లలు ఏ మీడియంలో చదవాలని అనుకుంటున్నారు అని అభిప్రాయ సేకరణ కోసం తల్లిదండ్రులకు ఇవ్వజూపిన నమూనాలో పూర్తి తెలుగు మీడియం అని ఒక మాట వాడారు. దీని స్థానంలో ఇంగ్లీష్ క్షుణ్ణంగా నేర్పించే ఆంగ్ల ఉపాధ్యాయులు ఉన్న తెలుగు మీడియం అని మార్పు చేయడానికి ప్రభుత్వం చొరవ చూపిస్తే అటు మాతృభాషకు, ఇటు ఆధునిక అవసరాలకు కూడా ఉపయోగ పడే పని చేసినట్లవుతుందని నేను భావిస్తున్నాను

ఒక చిన్న ఉదాహరణ చూద్దాం. ఆసుపత్రులలో ఒక క్లిష్టమైన ఆపరేషన్ చేయాల్సి వచ్చినప్పుడు వైద్యుడు ముందుగా రోగి బంధువులను పిలిపించి పరిస్థితిని వివరించి, కష్ట నష్టాలు , సాధ్యాసాధ్యాలు చెప్పి అప్పుడు మాత్రమే సంతకము లేదా వేలిముద్ర తీసుకొని ఆపరేషన్ చేయడానికి సిద్ధపడతాడు.

ఇక్కడ కూడా ఈ మాధ్యమంలో చదివితే ఎటువంటి ఫలితాలు వస్తాయి, విద్యార్థి స్థాయి ఏమిటి, బోధన మాధ్యమం గురించి మేధావులు అనాదిగా ఏమి చెబుతూ వస్తున్నారు మొదలైన విషయాలను కూలంకషంగా వివరించి ఆ తర్వాత మాత్రమే సంతకాల సేకరణకు సిద్ధపడాలి.

నిర్ణయాన్ని తల్లిదండ్రుల చేతిలో పెట్టినట్లే పెట్టి వారిచేతనే అవును అనిపించేలా చేయడం దీని వెనుక ఉన్న కుట్ర. చాలామందికి మూడు ముక్కల ఆట ఆడే విధానం జ్ఞాపకం ఉండే ఉంటుంది. దాంట్లో ఆడేవాడు మూడు ముక్కలను బోర్లించి ఏది ఎక్కడ ఉందో చెప్పమని ఎదుటివాడిని అడుగుతాడు. కానీ ఎదుటివాడు గెలుస్తాడు అన్న హామీ ఏమీ లేదు. పైగా చాలాసార్లు ఓడిపోయే అవకాశమే ఉంది. ఇదో కనికట్టు లాంటిది. విద్యార్థి భవితవ్యాన్ని నిర్ణయించే ఇటువంటి కీలక విషయాలలో కుయుక్తులు పన్నడం ఎంతవరకు సమంజసం?

తల్లిదండ్రుల కమిటీ ఏర్పాటు కచ్చితంగా ఒక ప్రజాస్వామిక చర్య. కానీ ఆ కమిటీ ఏ ఏ విషయాలలో జోక్యం చేసుకోవాలి? ఏ ఏ అధికారాలు దానికి కట్టబెట్టాలి అనే దాంట్లో విచక్షణ ఉండాలి. పాఠశాల మౌలిక సదుపాయాలు, పాఠశాలలో కొన్ని కార్యక్రమాల నిర్వహణ వంటి విషయాలలో తల్లిదండ్రుల ప్రమేయం అభిలషణీయం.

బోధన ఏ మాధ్యమంలో జరిగితే బాగుంటుంది అనే విషయం బోధన రంగంలో విశేష అనుభవం ఉన్న మేధావుల సూచనలకు అనుగుణంగా ఉంటే బాగుంటుంది.

ఇక్కడ అటువంటి ప్రయత్నం ఏదీ కనిపించడం లేదు. పైగా దీన్ని తూతూమంత్రంగా రెండు మూడు రోజులలో పూర్తి చేయడానికి సిద్ధపడ్డారు.

తాను తీసుకున్న నిర్ణయాన్ని ఏదో రకంగా అమలు చేయాలి అనే పట్టుదల కన్నా నలుగురూ ఏం చెబుతున్నారు అనేది పట్టించుకుని నిర్ణయం తీసుకుంటే జాతికి మేలు జరుగుతుంది.

ఇంగ్లీష్ నేర్చుకోవడానికీ ఆంగ్ల మాధ్యమంలో చదువుకోవడం ఒక్కటే మార్గము అనుకోవడం అశాస్త్రీయమైన భావన. ప్రపంచవ్యాప్తంగా ఎక్కడ కూడా భాషావేత్తలు, విద్యావేత్తలు, తత్వవేత్తలు ఎవరూ దీన్ని అంగీకరించలేదు.

ఆధునిక ప్రపంచంలో అందరూ ఆంగ్లం నేర్చుకోవాల్సిందే! సమాజంలో మరింత సముచిత స్థానాన్ని పొందడానికి, అవకాశాలు పెంపొందింప చేసుకోవడానికి, స్పర్ధామయ ప్రపంచంలో మనం తట్టుకోవడానికి ఇంగ్లీష్ కావాలి అనడంలో ఎవరికీ రెండో అభిప్రాయం లేదు. కానీ ఇంగ్లీష్ నేర్చుకోవడానికీ ఇంగ్లీష్ భాషని క్షుణ్ణంగా శాస్త్రీయంగా బోధించే ఉపాధ్యాయులు కావాలి. వీరిని అందిస్తామనే హామీని ప్రభుత్వ ఇవ్వాలి.

దీనికోసం ఆంగ్లభాషను శాస్త్రీయంగా బోధించే ఇఫ్లూ, ఆర్ ఐ ఈ లాంటి సంస్థల సహాయాన్ని తీసుకోవచ్చు. ఈ సందర్భంగా నల్గొండ జిల్లా కలెక్టర్‌గా పని చేసినప్పుడు ఆంగ్ల భాష విషయంలో క్షేత్రస్థాయిలో నేను చేసిన ప్రయోగాలు స్మరణీయాలు. అక్కడ రెండు రకాలుగా ఆంగ్ల భాష ప్రవేశపెట్టబడింది. 1 డిస్కోర్స్ మెథడ్ 2 పద సంపదను అభివృద్ధి చేసే విధానం. రెండు పద్ధతులు సంపూర్ణంగా విజయవంతం కావడమే కాకుండా దేశవ్యాప్తంగా గుర్తింపు

పొందాయి.

హైకోర్టు తీర్పుపై తన అభిప్రాయం చెప్పవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'రాష్ట్ర విద్యా పరిశోధన, శిక్షణ సంస్థ'ను అడిగింది. ఈ అభిప్రాయాన్ని ప్రజలకు అందుబాటులో ఉంచి దానిపై కూడా ప్రజాభిప్రాయ సేకరణ చేసి ఆ తర్వాతే సముచిత నిర్ణయం తీసుకోవడం ఉత్తమం.

2017-18 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ అక్షరాస్యత శాతం 67.4 మాత్రమే! ఇది జాతీయ సగటు కన్నా తక్కువే! అంటే దాదాపు ఇప్పటికీ సగం మంది నిరక్షరాస్యులే! ఇటువంటి పరిస్థితుల్లో విద్యార్థుల భవితవ్యానికి సంబంధించి ఒక నిర్ణయం తీసుకోబోయే ముందు ఆ విషయంపై తల్లిదండ్రులను కూడా విద్యావంతులను చేయవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంది. ప్రజాస్వామ్యంలో ఏ నిర్ణయమైనా ప్రజాస్వామిక చర్చ తర్వాతే జరగడం ఆనవాయితీ! ఆ సత్సంప్రదాయాన్ని ప్రభుత్వం కొనసాగించాలి.

**హైకోర్టు తీర్పును సానుకూల దృక్పథంతో అర్థం చేసుకొని ప్రభుత్వం భాషాపరంగా తన విధానాలను పునః సమీక్షించుకోవలసిన అవసరం ఉంది.**

---

ఈ వ్యాసరచయిత నందివెలుగు ముక్తేశ్వరరావుగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో- విభజనకు రెండురోజులు ముందు వరకు 2014మే - భాషా సాంస్కృతిక శాఖ కార్యదర్శిగా పనిచేసి ఉద్యోగవిరమణ చేశారు. అంతకుముందు నల్గొండ జిల్లా కలెక్టర్‌గా (2011-13) పని చేసినప్పుడు జిల్లా అంతటా పాలనను తెలుగులోకి తేవడంలో మొత్తం రాష్ట్రానికే ఆదర్శంగానిలిచారు. డెప్యూటీ కలెక్టర్‌గా పనిచేసినప్పుడు, ఆ తర్వాతా కూడా పరిపాలనలో ప్రజలకు సన్నిహితంగా ఉండి, ప్రజల కలెక్టర్‌గా ప్రజల్లో పేరుగాంచిన వ్యక్తి. తిరుమల తిరుపతి దేవస్థానం సంయుక్త కార్యనిర్వాహణాధికారి (జె.ఇ.ఒ.)గా తీర్మానాలను తెలుగులో వ్రాయించే సంప్రదాయాన్ని నెలకొల్పారు. మహాభారతం 18 పర్వాలనూ తెలుగులో సాధికార ప్రచురణ గావించారు (2005-2006). జీవితంలో తొలి నుండి ఎంతో కృషి చేసి సాధారణస్థాయి నుండి ఎదిగిన ముక్తేశ్వరరావుగారు విశ్లేషణాత్మకంగా ప్రసంగించడంలోనూ, వ్యాసరచనలోనూ తనదైన శైలిని కలిగివున్నారు. ఉద్యోగ నిర్వహణలోనేగాక, వ్యక్తిగతజీవితంలో కూడా ఆదర్శంగా నిలిచారు.

- సంపాదకుడు

కవిత

## సంస్కృతిపై అధికారం ప్రజలదే, పాలకులది కాదు

ప్రజాస్వామ్యం కూడా ఇంత విధ్వంసం చేస్తుందా !
జన సంస్కృతిని జనుల ఓట్లే పాతేస్తాయా !
ఒక ప్రజాప్రభుత్వం జనభాషను జీవచ్ఛవం చేసింది.
మరొక ప్రభంజన ప్రభుత్వం జీవం పోస్తుందనుకుంటే,
సజీవ దహనం సంకల్పిస్తున్నది.
పరభాష పట్టెడు మెతుకులు పెడుతుందనుకున్నా,
అమ్మ పొట్ట కొట్టి నోటికి తాళం వేస్తుందా !

దేశ దాస్యం కన్నా
భాషాదాస్యం ఇంకా కడుపు కోత కదా !
ఓటు, పాలించే హక్కునే ఇచ్చిందా
తరతరాల జన సంస్కృతిని
నాశనం చేసే హక్కునుగూడ కట్టబెట్టిందా !
మన ఓటుతో మన కంటినే పొడుచుకుంటామా?

తట్టలు మోసేవాడే బాలకార్మికుడా? -
అయోమయ పరభాషను
లేలేత తలపై మోసేవాడు పసి కార్మికుడు కాడా !-
ఓటంటే వేసిన వాడి ఇష్టంమాత్రమే కాదు.
వారి ఓటువెనుక తరతరాలున్నాయి.
వాటికీ లెక్కకు తేలనంత విలువుంది.
ఏ ప్రలోభాలకో ఓటు వేసినవారి పొరబాటు
తరతరాల చరిత్రను చించి పోగులు పెడుతుందా !
గెలిచిన ఓట్లు మాత్రమే ప్రజలు కాదు.
గెలువని ఓట్లు, ఇంకా బయటకు రాని ఓట్లు,
భయంతో దాగిన ఓట్లు,
ఇంకా పలకా బలపం పట్టని ఓట్లు,
మరణించిన గొంతుల ఓట్లు,
అన్నీవినగలిగిన వాడే జాతి ద్రష్ట.
అది వినలేని చెవిటివాడు జాతి భ్రష్ట.
ఓట్ల సంఖ్యాకవచం తొడుక్కున్న పిండారీ దోపిడిదారు.

వ్రాసిన రాజ్యాంగం మాత్రమే కాదు,
వ్రాయని రాజ్యాంగం ఇంకా ఎంతో వుంది.
శాసనసభకు రాలేని జనంతరంగం
దాన్ని తీర్మానిస్తుంది
వ్రాయని భవిష్యత్తును వెలికి తీస్తుంది.

డా॥ వావిలాల సుబ్బారావు
9866402973

తెలుగును బోధించడం కాదు; తెలుగులేనే అన్నీ బోధించాలి